నిమ్ము నీయిచ్చవచ్చిన యట్లుండుము. నేనుమాత్ర మిచ్చట నుండను. నాతండ్రిలం జేరెదగాక.

సుభ—ఇచ్చటనుండుట నాకుమాత్ర మిష్టమనుకొంటివా! నీవేగుచుండఁగా నిచ్చట నేనుందునా. నేనును నీవెంటనే వచ్చెద. నన్నుఁగూడ గొని నీతండ్రికడ కరుగుము.

అభి—అట్లయినచో మనమీక్షణంబునందే యీగృహంబును విడిచి పోవలయును. రమ్ము.

(ఇరుపురును నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# శశిరేఖాపరిణయము.

## తృతీయాంకము.

[అరణ్యము—సుభద్రయు, నభిమన్యుఁడును ప్రవేశము.]

సుభ—నాయనా! ఎట్టిఘోరారణ్యంబునకు వచ్చితిమిరా! భానుండు జొరలేనికాననంగా నిదియేకదా!

అభి—తే. గీ. మనకు నపకారమును సేయ మదిదలంచి
నట్టిబలరాము గృహమందు నలుకకంటె
నిట్టికాననమున వసియింపుచుండ
మంచిదౌచును మనకును బరగుగాదె.

సుభ—కుమారా! నీవుచెప్పినమాట నిశ్చయమే. అబ్బా! ద్వైతవనంబున కింకెంతదూరంబు నడువవలెనో కదా. ఎంతనడచినను తఱుఁగకున్నది. భీకరక్రూర మృగారవంబుల కొండలు కంపమొత్తుచున్నది.

[అరణ్యంబునంగల ఘోరమృగములకు సుభద్ర భయపడ కుమారుండగు అభిమన్యుఁడు జెప్పెడిపాట.]

కమాచిరాగం—ఏకతాళం.

ప॥ జననీవినుమమ్మా। జగదీ। శ్వరుడే। మనకిక। దిక్కు॥ జననీ॥

అ॥ ప॥ వనమునజరించు క్రూరమృగంబుల। కైయావంతయుభీతి
జెందకవే॥

మనమునకిఁకు ధైర్యమూనుచుఁ । నుండఁదగునె భీతిజెందఁకిఁ ।
మననమునకఁకు ధైర్యమూనుచుఁ ॥ జననీ॥
గనుమిదే । యీశరంబుఁ । గలుగమనకిఁకఁ । భయమదేలనే॥
తనుకలగాఁగను । దునిమెద నెట్టికౄరమృగంబులనైననుక్షణమున॥జన॥

అభి—అమ్మా! కౄరమృగంబులకు నీవానంతయు భీతినందవలదు. ఇదిగో! బాణమునాయొద్దనున్నది. నీవుమాత్రము నెమ్మదిగ నడువుము.

సుభ—అబ్బా! ఇదియంతయు ముండ్లమార్గముకదా. నడచుటకెంతయో కష్టముగనున్నది.

అభి—అమ్మా! నిన్నుఁజూచిన నాకెంతయుఁ జాలియగుచున్నది.

తే. గీ. చెమ్మటలుక్రమ్మె నీశరీ రమ్మునందు
వాడియుండె జంద్రునిమించి వరలుమోము
యెఱ్ఱవారెను చరణంబు లెంతయేని
కటకటా! చూచి యోర్వంగ గలనెచెప్పుమ.

జననీ! నీకు నిద్రవచ్చుచున్నట్లున్నది. కావున యీవృక్షముక్రింద నొక్కింతకాలము శయనించుము. నీకేమియుఁ భయంబులేదు.

సుభ—(వృక్షముక్రింద శయనించును.)

అభి—(తనలో) ఆహా! ఆయువిసీతుండగు బలరాముని కారణంబున మాకెట్టిగతి సంభవించినది. ఓరీ! బలరామా! చిన్ననాటనుండియు శశిరేఖను నాకొసంగి పరిణయము చేయుదుననిపలికి, యిప్పుడక్కన్నియను లక్ష్మణునకిచ్చుచు మాకిట్టిబన్నంబులఁగూర్చితివా! మాయమ్మ వలదనివారించుటంజేసి బ్రతికిపోయితివిగాని లేకయుండినచో నీయంతం బింతకుమున్నే





చూచియుందునుకదా! (ఇంచుక యూరకుండి శశిరేఖనుద్దేశించి) హా! రమణీమణీ! శశిరేఖా!

తే. గీ. నాకుసతివౌదువనుచు మనంబునందు
సంతసంబుననుంటి యింత సగోని యుంటి
నక్కటా నాదుయాశ నిరాసయయ్యె
గడుదురాత్ముఁడౌ నీతండ్రి కారణమున.

మ. జననంబాదిగ నీకుసఖ్యమెపుడుం జానా విడఁ లేదు నీ
జనకుండట్లొనరింప; ఘోరవనవాసం బిట్లుసల్పంగ, వే
జనుదేరం బనియయ్యె నేమనుదునే సంతాపముం బొందుచుం
మనమందుం స్మరియింపుచుంటి నినునో పర్వేందు బింబాననా.

తే. గీ. ముద్దులనుమాటగట్టు నీమోముతీరు
వెన్నెలలుగాయు నీనవ్వు వన్నెలరయ
ధరణిచంద్రార్కు లిరువురు వరలుదాక
మఱచిపోవ్రదమన్నను మఱుపురావు.

అయ్యో! శశిరేఖా! నీతండ్రి యట్లొనరింపగా నలిగి, జననీసమేతుండనై యిట్లుదెంచితినని విని యెంతగానార్తి పరితపించుచుంటివోకదా! ఎన్నడును బాసియెఱుంగని నిన్నిట్లు విడఁబాయవలసివచ్చెనుకదా. (ఇంచుక యూరకుండి) ఇంకనేనక్కన్నియకై యిట్లుచింతించిన నేమిఫలయాజనమున్నది?

తే. గీ. భవ్యశశిరేఖనాదుమనమ్మునెపుడు
హృత్ఫలకమందునే లిఖియించియుండె
దాని స్మరియింపుచెట్టులో ధరణియందు
గాలముమును వెళ్ళద్రోపెద గడిపెదనింక.

(సుభద్రంజూచి) ఆహా! వాతల్లికి నాకారణంబున నెట్టిగతి సంభవించినది ఇందుకుఁగారణంబు నేనేకదా!

సీ. శుద్ధాంతములయందు శోభిల్లునాతల్లి
ఘోరాటవినినిల్చి యుండవలసె
కనుపారభక్షించు కమనీయవిగ్రహ
యుపవాసములదూలి యుండవలసె
పరిచారికల్ గొల్వ వరలుచుండెడిలేమ
ఘనమృగారావముల్ వినఁగవలసె
హంసతూలికపాన్పు నందలరెడికాంత
కటికిరానేలపైఁ గ్రాలవలసె
తే. గీ. నకట బలరాముచేనింత యార్తివచ్చె
(యించుకయూరకుండి)
నతనినననేల మాకర్మ గతికి భువిని
ధాతలిఖియించి వెలసిన వ్రాతకాక
గాకయుండిన నీపాట్లు గలుగనగునె.

తల్లీ !

సీ. పటుబాహుశౌర్య సంపన్నుఁడై వెలసిన
పార్థుని మురిపెంపు బడతివయ్యు
విష్ణుస్వరూపుండు విశ్వరక్షకుఁడునౌ
వరవాసుదేవుని భగినివయ్యు
మహితశూరుడటంచు మంతుకెక్కినయభి
మన్యునిగాంచిన మాతవయ్యు
అపకారమేరికి నాచరింపనియట్టి
మహితసాధ్వీశిరోమణివయ్యు
తే. గీ. నజుడు మహామునవ్రాసిన యట్టివ్రాత
కతన బండఁగవలసెగా గాటడవిని



నకటా నినుజూచినా యాత్మయందు
శోకమేరీతి భరియింతు బ్రాకటముగ.

ఆహా ! మార్గమున నడచినట్టి యాయాసంబుచే నీవు గాఢనిద్రను బొందియున్నది. ఈనిద్రకు నేనావంతయు భంగము గలుగ సేయరాదు.

[తెరలో]

అస్మదీయ పరిపాలితంబగు నిమ్మహారణ్యంబునందు నరులెవ్వరును జొచ్చుటకు సాహసింపరు. చిరకాలంబునకు వంటింటిలోనికి గుందేలువచ్చుపగిది నాకంట నరుండొకఁడుపడినాడు. సంతృప్తిదీర వీనినాహారంబుగా గైకొందు.

అభి.—(తనలో) ఆహా! ఇయ్యది రాక్షససంచారముచే నిండిన ఘోరారణ్యముకాఁబోలు. తెలియక మోసపోయితిని. కానిమ్ము ఇప్పుడుమహాత్రిము మించినదేమున్నది. ఆయుధంబులు హస్తములందున్నవికదా. (పరికించిజూచి) అదుగో! ఎవ్వఁడో యొకఁడు మ్రుక్కడిరక్కసుండు భీషణాకారంబుతో భీకరాట్టహాసంబు గావింపుచు నిట్లువచ్చుచున్నాఁడు. రానిమ్ము. వీనిమదంబు దూల్చెదఁగాక.

[ఘటోత్కచుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఘటో.—(అభిమన్యునింజూచి)

శా. ఓరోరీ మనుజ భీతిలేకయొంటిమదం బొప్పారఁగా మత్పాలితం
బైరాజిల్లెడి యివ్వనంబునకు నేఁ శుంభల్లీల నేతెంచితే
ఘోరాస్త్రంబులఁ దాల్చితే కరములన్ గోపంబు గల్పించితే
క్రూరా! ప్రాణముపైన నాసయిక నీకున్ లేదె మర్త్యాధమా.

అభి.—ఓరోరీ! రాక్షసాధమా!

మ. మనమందించుక భీతిలేక నిటుద ర్పంబేర్చి యేతెంచి, నా
కునుభీతిం గొలుపంగబల్కెదె యిటుల్ క్రూరా! భయంబందకన్
ఘనబాణంబులచేత గూల్చెదనినుం శౌర్యంబు దీపింపఁగా
విరుతాటాకులచప్పుడుల్ వినినఁ గుందేళ్లెందు భీతిల్లునే॥

ఘటో—ఏమీ! నీకిండకానరము.

సుగంధి.

ఘోరకాననస్థలంబు కొంచమైన నెంచకన్
జేరవచ్చియిట్లు ధైర్య చిత్తమెంతొ బూనుచున్
గారులెన్ని పేలుచుంటి కన్నుమిన్నుఁ గానకన్
జేరవచ్చినాడ నిన్నుఁ జెండివేయ నిప్పుడే.

అభి—అరే! రాత్రించర వంశాధమా! నీబెదిరింపుల కిక్కడ నెవ్వరునుజడియువారు లేరు. నాకన్నులముందుబడినీ వెందుబోఁగలవు.

సుగంధి.

ఏలకారు లిట్లుబల్క నింతలాభమున్నదే
యాలమందు మోద మారనీక్షణంబునన్
గూలనేయ నెంచినాడ కోలచేత నియ్యదే
పాలిశా! రణంబువీడి పాఱిపోకనిల్వుమీ.

ఘటో—ఓరీ! దురాత్మ! నేనా పాఱిపోవువాడను! నరభోజనుండనని నీకుఁదెలియదా! నిన్నిక్కడనే యిప్పుడు మట్టుబెట్టెదను.

కవిరాజవిరాజితము.

అభి—శరణము వేడిన నిన్ విడకుండనె సంగరరంగము నందిపుడే
బోరిగొని బాహుబలంబును జూపుచు భూరిశరంబున గూల్తునినున్
వరమునులున్ సురబృందమునిత్యము భావమునన్ ముదమం
దగనున్

ఘటో—బరువడిబీరము లాడగనేటికి బాహుబలంబును జూపుమికన్,



అభి—ఇదిగో సంసిద్ధుఁడనై యుంటిని.

ఘటో—రణోచితస్థలం బదేయచ్చటనున్నది. రమ్ము.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు)

సుభ—(నిద్రనుండిలేచి) కుమారా! (కన్నులు తెఱచి) ఏమిదీ! యభిమన్యుం డెచ్చటికేగెనో కదా! (దిక్కులుపరికించి) అన్నా! ఎంతమోసమువచ్చెను. ఇయ్యది రాక్షససంచారమగు నరణ్యంబని తెలియకఁ బ్రవేశించితిమి. అదిగో నాకుమారుండొక్క మృక్కడి రక్కసునితోఁ బోరుసల్పుచున్నాఁడు. అయ్యో! ఏమిమోసము వచ్చెనో కదా! (అభిమన్యు నుద్దేశించి) హా! కుమారా! ఈరాక్షసునితో నేల పోరాటంబునకుఁ దలపడితివి. అయ్యో! మనకిట్టిగతి సంభవించినందుకే చింతింపుచుండ, జింతలో మఱియొక చింత గూర్చుచుంటివా! (తేఱిపాఱజూచి) అబ్బా! వీరిపోరు మహాఘోరంబగుచున్నదే. ఈయిరువురందున నొకరికొకరు తీసిపోవువారు కారు. అయినను కయ్యంబున ఫాలాక్షుని నిర్జించిన ధనంజయుని గర్భంబున జనించిన యిక్కుమారుండొక్క మృక్కడిరక్కసునకు లెక్కబెట్టునా. (ఎదుటంజూచి) అమ్మయ్యా! ఇప్పటికినాకు ధైర్యము కలిగినది. అదుగో నారదుండుకాబోలు వీరిపోరాటంబును మాన్పదలంచి వచ్చుచున్నాఁడు.

[నారదుండు ప్రవేశింపుచున్నాఁడు.]

నార—

ధ్రువకోకిల. జననమందిన యందుకెప్పుడు సంతసంబున భక్తితో
మనమునందున శ్రీరమేశ్వరు భవ్యతేజునిఁబుణ్యునిన్
వినుతిసజ్జనుభక్తరక్షకు విశ్వనాథుభజించినన్
ఘనముగామదిగోరియుండిన కార్యమెల్లఫలించుగా.

జగన్మోహిని. అన్నదమ్ములంచు నాత్మ నెంచకే
జన్నె యిట్లు సేయ స్వాంతమందునన్
గ్రిన్ననన్ రణంబు గాంతు జేసిరే
బన్ను గారణంబు మానుడింపిటన్.

[అంత ఘటోత్కచాభిమన్యులు ప్రవేశించి నారదునకు నమస్కరింపుచున్నారు.]

సుభద్ర—(నారదునకు నమస్కరింపుచున్నది.)

[ఒకరినొకరెరుంగక ఘటోత్కచాభిమన్యులు అరణ్యమున పోరుచుండ నారదుడు ప్రవేశించి పాడెడిపాట.]

సురటరాగము—ఏకతాళం.

ప॥ మీరిరువురిటుల పోర పరులకు నగుబాటగున్ ॥

అ॥ ప॥ ఆరయ మీరిద్వరు పాండవ వంశోద్భవులుగారె॥ మీరిరు॥

ఘటో—నారదమునివర్యా యేటికిటుల బల్కినారో దెల్పుడు ధీరుడ
ర్జునాత్మజుండు యభిమన్యాభిఖ్యుడితడు । భీమునిపుత్రుడవీవు॥
మీరిరు॥

నార—అభిమన్యా! ఇందాశ్చర్యమేమియు లేదు.

తే॥ గీ॥ సాధ్వియగునీ సుభద్రకు సవ్యసాచి
కీవు పుత్రుండవౌచును నెగడతేదె

అభి—మహాత్మా! అదిసరియే.

నార—వాయుపుత్రునకును హిడింబకును బుట్టి
యౌచునీ ఘటోత్కచుడు తానలరెగాదె.

ఈవిధంబున మీరిరువురును నన్నతమ్ములుగదా.

అభి—ఏమేమీ! ఈతను మా పెత్తండ్రియగు భీమసేనుని పుత్రుండగు ఘటోత్కచుండా. (ఘటోత్కచునకు నమస్కరించును.)



ఘటో—మునీంద్రా! ఈతండర్జునుని పుత్రుండును, నాకు దమ్ముండును నగు నభిమన్యుండా! (అభిమన్యుని జూచి)

మ. అనుజా! తమ్ముడవం చెఱుంగక నీయెడ దుర్వ్యాది కోపంబునన్
రణరంగంబున నీపయిన్ మిగుల శస్త్రంబుల్ ప్రయోగించితిన్
ఘననీదేహము నొంత నొచ్చెనొకదా కార్యంబు నేబూనుచో
మనమందాగ్రహ మందబోకుమిక సౌభద్రా! సుధీరాగ్రణీ.

అభి—అన్నయ్యా! తెలియక జేసిన దానికేమి! మనమీ సంయమీంద్రుని కటాక్షంబున మనము సుఖులమైతిమి.

సుభ—కుమారులారా! రణంబు జేసి మిగుల నలసి యుండిరి. ఇంచుక కాలము విశ్రమింపుడు.

ఘటో—అమ్మా! మిమ్ము నెఱుంగక నిట్టి దుష్కార్యంబు చేసితిని. నన్ను మన్నింపుము (నమస్కరింపుచున్నాడు.)

నార—పాండవకులజులారా! నేనిప్పుడు ద్వారకాపురంబున జరుగనున్న, లక్ష్మణుని వివాహంబీక్షింప బోవలయును. ఇంక నే బోయెదను.

సుభ—సంయమీంద్రా! నీమూలంబున నీకుమారులు సుఖవంతులైరి మీకృపను మేమెప్పుడును మఱువము.

(అందఱును నారదునకు నమస్కరింపుచున్నారు.)

[భగవంతుని స్తుతించుచు నారదుడు నిష్క్రమించెడిపాట.]

బేహాగ్ రాగం—ఏకతాళం.

ప॥ జగముల్ । సుఖము । బుగ సృజియించిన సర్వేశ్వరుని మహిమల్ ॥
బాగ మతు కెవ్వారితరమా । యిరాత్రి జగముల యందరయన్ ॥

అ॥ ప॥ నిగమంబుల్ । చోద్యమ్ముగన్ । వినుతించున్ । విరతుల్ ॥
భగవంతుని మహిని నిల్పుచు తద్భజనంబును సల్పుచు మెలగవలెన్ ॥ జగముల్ ॥

నార—(నిష్క్రమించును)

ఘటో—అమ్మా! ఈసాయమింద్రుడు ద్వారకాపురమందు జరుగనున్న లక్ష్మణుని వివాహమహోత్సవ మీక్షింపబోవుచుంటిని నచించెను. లక్ష్మణుండనగా గురురాజగు సుయోధనుని సుతుండేకదా. ఆతని కెవ్వరిపుత్రినిచ్చి పరిణయము సేయుదురు?

సుభ—కుమారా! మాయన్నయగు బలరామునిసుతయైన శశిరేఖ నిచ్చి వివాహము కావింతురు.

ఘటో—ఏమేమీ! శశిరేఖను లక్ష్మణునకొసంగి వివాహము కావించునా! ఆశ్చర్యముగనున్నదే.

తే. గీ. ఎల్లవిధములదగిన మేనల్లు డీత
డింటనుండ వీనివిడచి యేలకౌర
వేంద్రుని కుమారునకుం గన్నె నీయనెంచె
భవ్యగుణ తేజుడా బలభద్రుడిపుడు.

సుభ—ఆకారణంబుచేత నేగదా కుమారసహితంబుగ నట్టడవి కరావలసినగతి పట్టినది.

ఘటో—అమ్మా! అట్లు పలుకుచుంటివేమి! ఆకారణం బెఱుంగుటకును నాచిత్తంబు దత్తరపడుచున్నది. కృపతోబూని సత్వరంబుగ శెలవిమ్ము.

[అంత హిడింబ ప్రవేశించుచున్నది.]

హిడిం—(ఘటోత్కచునింజూచి) వత్సా! వీరెవ్వరు!

ఘటో—అమ్మా! ఈమె నాపినతండ్రియగు నర్జునుని దేవేరియగు సుభద్రామహాదేవి! ఈతండు నాతమ్ముండగు నభిమన్యుడు. విధివశంబున వారీనట్టడవిని బ్రవేశింప, నాకును వారలకును ఘోరకయ్యంబు జరిగినది. కాని, నారదమునీంద్రుని కృపాకటాక్షంబున మనబాంధవ్యము తెలిసికొనంబడినది.



హిడిం—చెల్లెలా! నిన్ను సకుమారసమేతంబుగా నేనువీక్షించుటం జేసి నాకెంతయో యానందము కలిగినది. అమ్మా! మీరిట్లు వచ్చుట కేమికారణము?

ఘటో—(సుభద్రింజూచి) తల్లీ! ఆకారణంబును జెప్పుము.

[అరణ్యమున దిరుగుట కారణం బేమని హిడింబసుభద్రనడుగ సుభద్రపాడెడిపాట.]

హిం॥ తోడిరాగం—ఏకతాళం.

ప॥ నేనేమని దెల్పుదుసోదరీ । నీవెరుగనిదా॥ నేనేమని॥

అ॥ ప॥ మేనమామలయింటను । చిన్నతనమునుండియు బెరిగెనుగద॥
యీనాసుతుడభి । మన్యుడుదలపక । యెంతో ముదమున
మొదటినుండియు ।
వీని కెమా శశిరేఖనిత్తునని । వేవిధముల బాసజేసి మమ్ముల ।
కానిమాటలనితుదకు యిట్టులనె ।
నీనాథునకును । తినుటకుకూడును । మనుటకుతావును ।
లేనే లేదుగ దాయనిధనము । కాన జెండిదుర్యోధనాత్మజునికివ్వ
ముహూర్తము నిశ్చయపరచె॥ నేనేమని॥

సుభ—ఈయభిమన్యుడు చిన్ననాటనుండియు, మేనమామలయింట బెఱుగుచుండెనని నీకుదెలియును కదా. బలరాముండా శశిరేఖను మొదటినుండియు వాగ్దానముజేసి, యిప్పుడు మేము కడుబీదలమైతిమని తలంచి, దుర్యోధనసుతుండగు లక్ష్మణున కీయ నెంచెను. అంతియేగాక మమ్ములను పాండవులను నతిదూషించెను. అట్టివానిగృహంబున నుండుటకును జిత్తంబున సమ్మతింపకుంటను జేసి యిట్లువచ్చితిమి. నిన్నుజూడగంటిమి. ఆనందంబొందితిమి.

ఘటో—ఏమేమీ! బలరాముండే యిట్లుచేసెనా! (బలరాముని నుద్దేశించి) ఓరీ బలరామా! యాదవకులపాంసనా!

శా. ఏమేమీ! భయమింతలేక మదిలో నిల్లాళితో సర్వతో
కామక్రోధమదాంధకార! తులువా! గర్వంబునుం బూని, నీ
వామాన్యుల్ వరపాండురాట్సుతుల నత్యంతంబు దూషించితే
భూమిన్ నీతల వ్రెల్చ నేతునిదిగో పూర్ణప్రతాపమ్మునన్.

ఓరీ! యవివేకీ! పాండవేయుల కాలిగోరున కైనను నీవు సముండవగుదువా! (సుభద్రం జూచి) అమ్మా! ఇట్టిసంబంధముచేయుటకు కృష్ణుం డంగీకరించెనా!

సుభ—వత్సా! ఘటోత్కచా! శశిరేఖచిత్తం బభిమన్యునియందు లగ్నంబైయున్నది. కృష్ణుండును, రేవతియు నీసంబంధమువలదనియు, నభిమన్యునకీయవలసినదనియు, నొక్కి వక్కాణించిరి గాని, శశిరేఖాభిమన్యుల పరస్పరమోహానుబంధంబైనను విచారింపక, బలరాముం డిట్లు సేయ నెంచెను.

ఘటో—కానిమ్ము. తత్ఫలంబతఁడు గుడుచుగాక. మేనల్లుఁడింటనుండెననియైనను జూడక నీసంబంధంబు నాసుయోధనుం డెట్లుగోరెనో. దుష్కర్ములకు నుక్తాయుక్తవిచారణ మెట్లలవడును. (అభిమన్యునిఁజూచి) తమ్ముఁడా! వివాహమెప్పుడు జరుగనున్నది?

అభి—అగ్రజా! వివాహముహూర్తము రేపే. సుయోధనాదు లీపాటి వచ్చియేయుందురు.

ఘటో—అట్లనా! కానిమ్ము. తమ్ముఁడా! ఇంక నాలోచింప నవసరము లేదు.

మ॥ మనమం దెంతయు సంశయింపకుము భామాశిరోరత్నమున్
ఘనమాయాబలమేర్పడంగ నిపుడే గొని దెచ్చి యిచ్చోట నీ



కును నుద్వాహము సల్పెదన్ వినుము నీకోర్కెల్ దగం దీరగా
మనమందానతి నీదెసామ్మెయినుచున్ భావింపుమీ తమ్ముఁడా.

అభిమన్యా! ఇంక నాలసింపజనదు. నేమాయాబలంబున శశిరేఖం దెచ్చి వారేర్పఱచిన ముహూర్తంబునకే నీకిక్కడ వివాహంబు గావించెద. నాకెవ్వరైన నడ్డమువచ్చినచో మదముదూలించెదగాక.

అభి—అన్నయ్యా! అనలంబునకు వాయువు సహాయమైనట్లు నేను నీకు సహాయుడనగుదును. ఆచిత్రము నేనుగూడ జూచెదను. నన్నుగూడ గొనిపొమ్ము.

హిడిం—వత్సా! నీకోరిక దీర్ప నీఘటోత్కచుండు చాలును. నీవేగ నవసరములేదు. ఆతండే శశిరేఖను దోడి తెచ్చును.

ఘటో—తమ్ముఁడా! నీవిచ్చట తల్లులను జూచుచుండుము. నేనొక త్రుటిలో శశిరేఖం దెచ్చెద.

అభి—అగ్రజా! నీయాజ్ఞననుసరించెదగాక.

విభూతి.

ఘటో—మానసంబునం దికన్ బూనుమీ ముదంబునన్
మానినీశిరోమణిన్ నేను దెచ్చెదన్ త్వరన్.

(నిష్క్రమించును.)

సుభ—(హిడింబనుజూచి) అక్కా! కుమారుండగు ఘటోత్కచుం డరిగెనుగాని నామనంబుమాత్రము సందియమందుచున్నది. యాదవకౌరవవీరులచే నీతనికేమి ముప్పువాటిల్లునోయని భయము కలుగుచున్నది.

హిడిం—సుభద్రా! ఘటోత్కచుని విషయమై నీవేమియు సందియంబందవలదు. అతఁడు మహామాయాబలసంపన్నుఁడు. రిపులకు లక్ష్యపెట్టువాఁడుకాఁడు. అతండీపాటికి వచ్చుచునేయుండెను.

సుభ—ఇంతలోనే వచ్చునా!

హిడిం—ఆకాశసంచారిణినై మాయాబలంబున నేగివచ్చుట కెంతి కాలము కావలెను.

[ఘటోత్కచుఁడు శశిరేఖతో దల్పసహితముగ ప్రవేశించును.]

ఘటో—(అభిమన్యునిఁజూచి)

మ. ఇదెనీగోరినయట్టి కన్యకమదం బేపారగాఁ జూడుమీ

(సుభద్రంజూచి)

ఇదెనీకోడలు; చంద్రబింబసమ నీ వీక్షింపు మాతల్లిరో

మదిరాక్షీమణి దోడితెచ్చితిని నా మాయాబలం బేర్పడన్

మదిరంజిల్లగ బెండ్లి జేయుదమికన్ భవ్యప్రమోదంబునన్.

సుభ—వత్సా! నీకసాధ్యమైన కార్యమేమున్నది?

అభి—(తనలో) ఇప్పుడుకదా! నాకుసంతోషముకలిగినది. (ప్రకాశముగా) అగ్రజా! నాకై యెంత శ్రమంబునొందితివోకదా.

[ఘటోత్కచుఁడు తనమాయాబలంబున శశిరేఖం దెచ్చి యభిమన్యునిచెంత జేర్ప యభిమన్యుఁడు పాడెడిపాట.]

కమాచ్ రాగం—ఆదితాళం.

ప॥ సోదరా సోదరా నాహృదయము । ముదమొదవగ । పదిలపడగ జేసితివాహా॥

అ॥ ప॥ నీదుశక్తి కేమనందు । యెంతనినేనునుబొగడుదు నాదుప్రాణ ధనమగు యీ । శశిరేఖన్ । శత్రువులకన్ । దాటిదెచ్చితి వాహాహా॥ సోదరా॥

ఘటో—తమ్ముఁడా! ఇది మనకు శ్రమకాదు. మహాసంతోషము.



[శశిరేఖ—నిద్రలేచుచున్నది.]

శశి—(లేచి కన్నులునలుపుకొనుచు) ఏమిది! నేనెచ్చటబండితిని. ఎచ్చటమేల్కొనియుంటిని. ఈఘోరారణ్యంబున కెట్లువచ్చితినోకదా. (సుభద్రాభిమన్యులంజూచి) నామనోహరుండగు అభిమన్యుండును, అత్తయగు సుభద్రయు నిచ్చటనున్నవారే. ఆశ్చర్యముగనున్నదే. ఒకవేళ కలగాంచుచుంటినా. కాదుకాదు. జాగ్రతావస్థయందే యుంటిని.

సుభ—(శశిరేఖంజూచి) అమ్మాయీ! శశిరేఖా! భీతినొందకుము. ఇదుగో నీమనోహరుండగు నభిమన్యుండు. ఈతండు నీబావగారగు ఘటోత్కచుండు. లక్ష్మణునకీయనెంచిననిన్ను మాయబలంబున నీతడిచ్చటకుదోడ్కొనివచ్చినాఁడు. ఇంక సంతసింపుము.

[అరణ్యముననున్న సుభద్రాభిమన్యులం శశిరేఖజూచి పాడెడిపాట.]

బేహాగ్ రాగం—ఏకతాళం.

ప॥ యేమనందునాభాగ్యము ॥ఆహాహా॥

అ॥ ప॥ నామనంబున కొందలంబడంగెన్ । యానందమొదవె॥ యేమనందు॥

మామహాబలాఢ్యుఁడునా । కీతడిభగవంతుడె నామనోహరునిసన్నిధి । నన్నుఁజేర్చెనాహాహా ॥ యే॥

శశి—(తనలో) ఏమినాభాగ్యము. ఈఘటోత్కచుండు నాపాలిటికి భగవంతుఁడయ్యెనుగదా.

ఘటో—తమ్ములారా! నేనిప్పుడు ద్వారకాపురమునకేగి యచ్చటి

వాహికచిత్రంబులు జూడవలయును. మీరిచ్చటవివాహప్రయత్నము జరుపుచుండుడు. నేనిదేయేగెదను.

సుభ — మున్ను మీతండ్రులు దుర్యోధనదుశ్శాసనకర్ణులయెడల జేసినప్రతిజ్ఞలు జ్ఞప్తియందుంచుకొనుము.

ఘటో — మంచిది.

(నిష్క్రమించును.)

హిడిం — చెల్లెలా! మనమింక యాశ్రమంబున కేగుదము. రండు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.





శ్రీ

# శశిరేఖాపరిణయము.

## చతుర్థాంకము.

[ద్వారకానగరమున సౌధమున శశిరేఖాకృతితో ఘటోత్కచుడు ప్రవేశము.]

శశి — (తనలో) భళా! శశిరేఖను నాయాశ్రమంబున నభిమన్యునివద్దనుంచితికదా. నావేషమంతయు శశిరేఖవలెనేయున్నది. నన్నుజూచియెవ్వరును నానవాలుపట్టలేరు. ముహూర్తముకూడ సమీపించుచున్నది. పెండ్లికూతురునుగదా యనితలంచి నన్నుదోడ్కొనిపోవుటకుం జెలికత్తెలు వచ్చెదరు కాబోలు. ఆ సమయంబున నేనునిజమైనశశిరేఖవలెనే నటింపుచు, నభిమన్యునిపై జిక్కియున్నయనురాగంబునుగూర్చి విచారింపుచునుండెదగాక. (ప్రక్కకుందిరిగిచూచి) అదిగో చెలికత్తెయగు భారతివచ్చుచున్నది. అభిమన్యునిగూర్చి సంతాపమందుట నటింపవలెను. (అభిమన్యునుద్దేశించి)

ఉ॥ హా సుకుమారగాత్ర! సుగుణాకర! హా చిరపుణ్యశీల; యా
హా సరసీరుహాక్ష! సుజనావన! నాదగుతండ్రిమాటపై
నీవు జనించిరోసమున నీదగుతల్లియు వెంటరాక, నన్
బాసియరణ్యభూమికి జనంగను న్యాయమె యర్జునాత్మజా.

అయ్యో! చిన్ననాటనుండియు నీవే నాకుభర్తవగుదువని యెంతయో మురిసితినే. అక్కటా! నాయాశలెల్లనడుగంటినవికదా. నీవు

నాగళంబున మంగళసూత్రంబుగట్టుదునవితలంచితిని గాని, యా కురుకుల పాంసనుండగు లక్ష్మణుండుగట్టునని కలయందైనను తలంపనైతినే. (బలరామునుద్దేశించి) హా! తండ్రీ! నాయెడల నెంతకౄరత్వము వహించితివి!

తే. గీ. తండ్రి! యభిమన్యుపైనఁ జిత్తంబుదగిలి
యుంట నీమదికిఁదెలిసి యుండి; యిట్లు
గొంతుగోయంగనెంచితే కోర్కెతోడ
కటకటా యేమనందును నా కర్మగతికి.

(అభిమన్యునుద్దేశించి) అభిమన్యా! మారసమానసుందరా! నీరూపంబు నాకనులయెదుట బ్రకాశింపుచున్నదికదా. అయ్యో! నీపైఁజిక్కియున్న నామనంబాలక్ష్మణుని నెట్లువరించును!

[భారతి ప్రవేశించుచున్నది.]

భార—(శశిరేఖను సమీపించి) చెలీ! శశిరేఖా! ఇంకనునీవిట్లేయుండి సంతాపమందుచుంటివా! వివాహముహూర్తమింక మూఁడుఘడియలున్నదని నీకుదెలియదా. లెమ్ము లెమ్ము.

శశి—(నిట్టూర్పుపుచ్చుచు) ఉష్. నన్నెందుకుఁజంపెదవు. నీవు నన్ను మాటలాడించక నూరకొనుము.

భార—అమ్మా! అట్లందువేమి? లేచిరమ్ము.

శశి—ఎచ్చటికిరమ్మందువు?

భార—పెండ్లిపీటలమీఁద గూర్చుండుటకు.

శశి—పెండ్లి లేదు పేటాకులు లేవు. పీటలు లేవు చాటలు లేవు. పొమ్ము నామనంబంతయు డోలాయమానమైయున్నది. అతిగామాటలాడించకుము.

భార—అయ్యో! సఖీ! ఎంతమాటపలికితివి! శుభసమయంబున న ట్లనరాదు. నీసంతాపంబునకు గారణంబునే నెఱుంగుదును. చిం



తించినందువలనఁ గన్నులువాచుటతప్ప వేరొండుప్రయోజనంబేమియులేదు. ఎంతపరితాపమందినను నభిమన్యుఁడింక రాఁడు. లక్ష్మణుండే నీభర్తయని యవ్విరించి నీనుదుట మూఁడుబంతులవ్రాసినాఁడు. ఇంకనీవాయభిమన్యునిపై యనురాగంబును ద్రెంపివేయుము.

శశి—అక్కటా! ఎంతమాటచెప్పితివి! అభిమన్యునిపై బ్రాకిన నా యనురాగలతను ద్రెంపుటయెట్లు. జీవంబులున్నంత వరకును నదినాహృదయంబున నుండునదే. (అభిమన్యునుద్దేశించి) హా! సుభద్రాకుమారా!

తే. గీ. నీగుణంబులు నీప్రేమ నీదురూపు
నీవిలాసంబు నీనవ్వు నిక్కముగను
నాదుమానసంబందున నాటియుండె
మఱచిపోవుదమన్నను మఱుపురావు.

(కన్నీరునించును.)

భార—చెలీ! నీవావిషయంబునుగూర్చి యింక దలపెట్టి చింతింపకుము.

తే. గీ. కౌరవేంద్రుని సుతుఁడె నీ కాంతుఁడంచు
మూఁడుబంతులువ్రాసె నీ మోమునందు
ధాతదానినిదప్పింప దరముగాదు
చింతఁబొందఁగనేటికి స్వాంతమందు.

అమ్మా! నీవిట్లు చింతింపుచున్నచో నెవ్వరైనను వినిపరిహసింతురు. నామాటవినుము. ఇంకరమ్ము.

శశి—నీవెంతచెప్పినను వినకుంటివే. నీకు బుద్ధిలేదాయేమి! ఈదిక్కుమాలిన పెండ్లితో నాకేమిపనియున్నది. పెండ్లియైనను సరే. పేటాకులుండినను సరే. నాకవసరములేదు. నాదారినే

నుజూచుకొనెదను. అభిమన్యాసక్తమైయున్న నాచిత్తంబా
తుచ్ఛుండగు లక్ష్మణుని వరింపదు. వేయేల. నేనురాను. నీవు
పొమ్ము.

భార—అమ్మా! ఎంత చెప్పినను వినకున్నదానవు. నీకు బాగోగులు
తెలియవు. వాపోవుచున్న భర్తనట్లు దూషింపరాదు. పవ
తులకు భర్తదైవసముండుకదా.

శశి—నీవుచెప్పిన వాక్యం బిచ్చట నన్వయింపదు. అన్యోన్యానురా
గంబులేని వధూవరుల సంబంధమేల. కాల్పనా! నాబాల్యం
బునుండియు నాభర్తయనియు, దైవసముండనియు, సౌభద్రు
నిదలంచి యుంటిని. కురుకులపాంసనుండగు నీలక్ష్మణుండెవరు.
ఇయ్యది నాపురాకృత ప్రారబ్ధవశంబున గదా సంభవించినది.
ఇందునకు నేనొడంబడుదునా!

తే. గీ. ఎల్లవిధముల దగినమే । నల్లువిడచి
కురుకులాధమునకునన్నుఁ । గోర్కెతోడ
నిచ్చుచుండెను సంపద । కెంతయుబ్బి
గొంతుకోయంగ గాదొకో । కోమలాంగి.

కానిమ్ము. అందులకు దగినఫలంబు నాతండ్రి యనుభవించుగాక. నీ
వేగుము. నేనురాను. (ముసుగువేసికొని పండుకొనుచున్నది.)

భార—(తనలో) అక్కటా! ఈమె మూర్ఖత్వము వహించి యెంత
చెప్పినను వినకున్నది. ఈమెను దీసికొనిపోవుటకు నాకుందరం
బుగాకున్నది. ఈమెతల్లియగు రేవతీదేవిని దోడ్కొనివచ్చెద.
ఆమెచెప్పినంగాని వినదు. (నమస్కరించి వెంటనే రేవతితోఁ
బ్రవేశించుచున్నది.]

రేవ—(శశిరేఖనుజూచి) అమ్మాయీ! శశిరేఖా! లెమ్ము. లెమ్ము.



శశి—అమ్మా! నన్ను లేపకుము. నాకుందలనొప్పి యత్యధికంబుగ
నున్నది.

రేవ—కుమారీ!

[దుర్యోధనకుమారుండగు లక్ష్మణునకు పెండ్లిజేయుదురని శశిరేఖ
విచారించుచుండ తల్లియగు రేవతిపాడెడిపాట.]

కేలువరాగం—ఏకతాళం.

ప॥ తనయావినుమా । తగదుయిటుల వగలుబొగల॥

అ॥ ప॥ మనమునసీవిధమున దిగులొందిగుందెద యెన్నిదినములు చిం
తించిన నీకేలయౌను యభిమన్యుడు ॥తనయా॥

గనుగొనలక్ష్మణుడేనీ । కాంతుడనుచు ముమ్మాటికి నీనుమాటన్ । లిఖ
యించె । నీరజగర్భుడు దృఢముగ ॥తనయా॥

చ॥ చినతనమాదిగామదిని । శిష్టగుణుండభిమన్యుడేధవుం
డనిదలపోసియుంటివిక । టా యది వ్యర్థమెయయ్యెనీయెడఁ
ఘనకృపబూనడాయెకద । మాధవుడేమని చెప్పుదమ్మ, యా
వనజభవుండు జేసెనిటు । భర్తగలక్ష్మణు నూరడిల్లుమీ॥

ధాతవ్రాత దప్పించుటకు నెవ్వరితరంబును గాదు. ఇంకనాయభిమ
న్యుఁడు నీకుఁబతియగునను యాస మనంబునఁబరిత్యజింపుము.

శశి—తల్లీ! నీవెందులకిట్లు పలికెదవు. అభిమన్యాధీనమైయున్న నా
చిత్తంబు లక్ష్మణునివరింపదు. అంతకంటె నేనుప్రాణంబులఁ
ద్యజించి సుఖించుటయేమేలు. కావున నట్టిపనిజేసెద.

రేవ—తల్లీ! నీవెంతయు వెఱ్ఱిదానవు. ఏమియుం దెలియదు. సమ
స్తంబును భగవదాధీనము. బాల్యంబునుండియు నభిమన్యుని
గోరియుంటివికదా, నీకోరిక నెరవేరినదా! చచ్చెదనని చె
ప్పుచుంటివి. అయ్యదిమాత్రము మనస్వాధీనమా! చావుకా

వలసినప్పుడు వచ్చునా! పిచ్చికూతురా! ఎంతమాట పలికితివి.

శశి—అమ్మా! నన్ను వెఱ్ఱిదాననని పలుకుచుంటివి. నాహృదయంబుననున్న సంతాపము నీకేమి తెలియును. ఇట్టివివాహమును జేసికొని దుఃఖించుటకన్న చచ్చుట శ్రేయస్కరముకదా. అభిమన్యుని పెండ్లియాడుట నాస్వాధీనముకాదుకాని మృత్యువు నాస్వాధీనంబునందే యుండెను. చూడుము.

ఉ. అనలము లేదె; కంఠమున హారమునందున రత్నముండదే
ఘనగరళంబు లేదొ వర ఖడ్గము చేతికిఁ జిక్కకుండునే
వననిధు లెల్లయింకిన వె బారెడు త్రాడునుగల్గదొక్కొ యీ
తనువు పరిత్యజించి పరి తాపము వీడి సుఖంబునందగన్.

రేవ—అమ్మా! ఇట్టి శుభసమయంబున నట్టియమంగళవాక్యంబుల నుచ్చరింపకుము. నామాటవిని పిచ్చిపట్టుపట్టక సత్వరముగ రమ్ము.

శశి—అమ్మా! ఇందుపట్టుదలయేమున్నది? నాకెందుకిట్లు చెప్పెదవు!

రేవ—పిల్లా! మూర్ఖతవహింపకుము. ఇట్టిసంగతి పెండ్లికొడుకువారు విన్నచో నగుబాట్లుతప్ప మరేమియులేదు. లోకులెల్లరును హాస్యింతురు. అదియట్లుంచుము. నీవింకను నభిమన్యునిపై మోహంబు విడువకుంటివి. లక్ష్మణుండుమాత్రము సామాన్యుడని తలంచితివా యేమి?

భువనైకసుందరి.

మారసముని సుమహితసద్గుణు మాన్యతేజుని ధీరునిఁ
గారవెందరిజు కంజనేత్రుని కల్మషుని సుచరిత్రునిఁ
ధారుణీధర ధైర్యచిత్తును ధర్మనిజుడుమిన నిం
పారగాభువ నైకసుందరు నాత్మయందునమోదమున్,



ఇంక నామాట కెదురాడక నిట్టిచిల్లిబుస్సులుమానిరమ్ము.

(చేయిఁబట్టుకొని భారతితో నిష్క్రమించుచున్నది.)

రంగము:—వివాహమందిరము.

[దుర్యోధన, కర్ణ, భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామలు ప్రవేశించుచున్నారు.]

దుర్యో—మిత్రమా! కర్ణా! బలరామునకు నాయందధికప్రేమకదా! ఆకారణముచేతనేకదా!

కర్ణు—అందుకనే కృష్ణుని ప్రతిజ్ఞలుసాగినాయి.

బల—తే. గీ. ఆబలుండు మనదెస నలరెనేని
బవరమున గెల్వవచ్చును పాండుసుతుల
బలుని వీక్షించి రుక్మిణీ వల్లభుండు
జేరడే మనపక్షంబు శీఘ్రగతిని.

భీష్మ—వత్సా! నీవెప్పుడును నిట్టితలంపులనే తలంపుచుందువు. బలరాముండు నీసుతునకుఁ గూతురు నొసంగినంతమాత్రమునఁ గృష్ణుండు నీపక్షమవలంబించునా! నీవట్లెప్పుడును తలంపకుము.

కర్ణు—(దుర్యోధనునిఁజూచి) రాజా! కౌరవేశ్వరా! నీవు నిజముగ వక్కాణించితివి.

ద్రోణు—దుర్యోధనా! నీవు చెప్పుటకును నీతండ్రి సరియనుటకును సరిపోయినది.

భీష్మ—వత్సా! సుయోధనా!

తే. గీ. ఆబలుఁడు బాల్యమాదిగ నతనిసుతను
నర్జునాత్మజునకునిత్తు నంచుఁబలికి
యలరె; నాకతంబున వివాహంబునమ్మఁజాల
నాతియభిమన్యు పొమ్మంచు నమ్ముమయ్య.

దుర్యో—ఏమి! పితామహా! ఇట్లు పలుకుచుంటిరి? బలభద్రుఁడు నాయెడలగల కరుణచే నాతనిపుత్రిని నాపుత్రునకిచ్చి పరిణయము సేయఁదలంచెను. వివాహలగ్నంబుంచుక ముహూర్తకాలమున్నదికదా! మనమందరమును పెండ్లికై వచ్చితిమి. ఇట్టి యమంగళవాక్యంబులు నీవంటిపెద్దలాడఁదగదు.

ద్రోణు—దుర్యోధనా! భీష్మాచార్యులపలుకు సత్యమే.

తే. గీ. బలునకీయంగ మదిలోన వాంఛయుండె
మాధవుండిష్టపడలేదు తన్మాతలెందరి
యతఁడెయేదైనభంగంబు మతినిదలప
సేయఁదలపడె మసలకు శీఘ్రగతిని.

దుర్యో—ఏదైనశుభకార్యంబులయందు మీరెప్పుడును నిట్టివాక్యంబులనే పలుకుచుందురు. బలరాముండు తనసుతను తనకిచ్చువచ్చినవారికి బెండ్లిసేయుచుండగా, నిందుఁగృష్ణునియవసరమేమున్నది. మీవాక్యంబులుజూడ నిప్పుడువివాహముసాగదనియే యభిప్రాయముగలుగుచున్నది. చాలు. చాలు. ఇంకనెప్పుడును నట్టివాక్యంబులాడకుఁడు.

కర్ణ—రాజా! నీవు వీరిపిఱికిమందులను ద్రావి యధైర్యపడకుము.

అశ్వ—సహజధైర్యచిత్తుండవు నీవు రారాజునకు ధైర్యంపుమందులిగ పోయుము.

కర్ణ—తే. గీ. సకలభువనైకజాలంబు శౌర్యమూని
యెత్తివచ్చిన భయమంద నింతయైన
మాధవుండెంత నాముందు తన్మాతలెందరి
వీరిమాటలునమ్మకు వెఱ్ఱివగుచు.

ద్రోణు—కర్ణా! నీబింకములుచాలింపుము. నీశౌర్యమువ్యర్థకిఁదెలియ



డు. "వోటిబానకు శబ్దమెక్కు"వను వాక్యము నీయందే యనుకూలించెను.

కర్ణ—ద్రోణాచార్యా! చేసినను చేయకపోయినను వీరవిహారంబు నేనే చేయవలయును. తిండికైరాజుం జేరిన మీరేమి సేయఁగలరు.

అశ్వ—ఓరీ! దుర్మతీ! సూతకులప్రసూతా! ఏమిరా!

తే. గీ. అందరికి నస్త్రగురువౌచు నలరునితని
నేమియోప్రేలుచుంటివి హీనచరిత
క్రూర వేందు్రనివీక్షించి యూరకుంటి
కాకయుండిన నఱుకనే ఖడ్గమునను.

[తెరలో]

(మంగళధ్వని వినిపించును.)

దుర్యో—(తనలో) ఇంకవీరికి నేనూరుకొన్నచో వాక్కలహంబు వృద్ధియగును. (ప్రకాశముగా) భీష్మద్రోణులారా! పెండ్లివారు వచ్చుచున్నారు. వివాహముహూర్త మాసన్నమైనది. ఇట్టిసమయములో మనమిట్లనుకొనుచున్నచోఁ జూపరులువిని పరిహసింతురు. కావున తాల్మివహించి యూరకొనుఁడు.

[బలరామాదియాదవులు ప్రవేశించుచున్నారు.]

దుర్యో—(బలరాముని వీక్షించి)

తే. గీ. ఎవనియన్నృపులందుమేటియై యొగడునట్లు
సత్యసౌఖ్యంబులనిడఁగదా సమరమందు
కోవిదునిగాఁగ నొనరించెఁ గోర్కెతోడ
నట్టినీకు నమస్కార మనఘమూర్తి.

(అని నమస్కరింపుచున్నాఁడు.)

కర్ణు—(బలరామునిం జూచి) కౌరవశ్రేయస్కామా! బలరామా! మీ ప్రియశిష్యుండును, రారాజునునగు, మా సుయోధనునియం దు మీకుంగల వాత్సల్యముచేతనే యీతనితో మీరు వియ్యమందఁగంటిరి. విక్రమోద్దామా! బలరామా!

బల—

సీ. ఇదికదా సుదినంబు । తుదిలేని సిరిచేత
నలరు నవియ్యంబు । నందినాడ
ఇదికదా సుదినంబు । మ్మదిరాక్షి శశిరేఖ
కునుదగు భర్తను । గూర్చినాడ
ఇదికదా సుదినంబు । నెంతైన సత్కీర్తి
యవనీశులందున । నందినాడ
ఇదికదా సుదినంబు । మదియందు నిష్ఠతో
జేసిన పూజలు । వాసిగాంచె
తే. గీ. కలరె ననుఁబోలు ధన్యులు । తలఁపమదిని
నన్నివిధముల ధన్యుండ । నైతి మిగుల
కురుకులంబుతో నిప్పుడు । చుట్టరికమబ్బె
నదియె పదివేలు నాకింక । నవనియందు.

దుర్యో—మహాత్మా! శిష్యునియందు మీ రెప్పుడును గృపఁబూని యే యుండిరికదా.

విష్ణుశర్మ—అయ్యలారా! ఈమాటల కేమి! వివాహముహూర్తమా సన్నమగుచున్నది. పెండ్లికూతురు యింకను రాదేమి?

బల—అదిగో! పెండ్లికుమార్తెను దీసికొనివచ్చుచున్నారు.

[శశిరేఖ భారతితోఁ బ్రవేశించుచున్నది.]

భార—చెలీ! శశిరేఖా! దీనభావంబును విడనాడి, యుసహ్యముగ



నుపఱుపక, మహాసంతోషితస్వాంతవై యఖిలలక్షణలక్షితుం డగు లక్ష్మణుని వీక్షింపుము.

మ. చతురంభోధిపరీతముద్రిత మహీ । చక్రంబు బాలించు నా
యతబాహాబలుఁడై సుయోధనుఁడపే । దూషప్రీక్షనున్నాఁడు, త
త్సుతుఁడౌ లక్ష్మణబాలకుండు గనుమీ । శోభిల్లగా నాతఁడే
పతియౌ నీకును, సంతసింపుమిఁక నీ । భావంబునన్ సుందరీ.

విష్ణు—ఇంకను నాలస్యము సేయుట వేమి? వేళ లేదు. పెండ్లికుమారిని గూర్చుండబెట్టుము.

(అట్లుచేయుచున్నారు.)

భీష్మ—(విష్ణుశర్మం జూచి) భూసురోత్తమా! ఇంక నాలస్యమెందుకు? కానిండు.

విష్ణు—ఇదిగో! (భజంత్రీలను జూచి) భజంత్రీలు మేళం చెయ్యండిరా!

(మంగళధ్వనులు మ్రోగును.)

విష్ణు—అయం ముహూర్త స్సుముహూర్తోస్తు.

దుర్యో—(లక్ష్మణునిజూచి) కుమారా! ఇంక తెరదీసెదరు. నీమనోహ రిని వీక్షింపుము.

(తెరఁదీయుచున్నారు.)

లక్ష్మ—(శశిరేఖం జూచి) అబ్బా! చూడఁజాల! చూడఁజాల.

(కన్నులుమూసికొనుచున్నాఁడు.)

దుర్యో—కుమారా! కన్నులు తెరచి చూడుము. శశిరేఖాశరీరసౌం దర్యప్రభలు నీకన్నులకు మిఱుమిట్లు గొలుపుచున్నవి.

లక్ష్మ—(కన్నులు తెఱచి చూచి) అమ్మో! ఏమిది! కన్యగాన్పించ దేమి?

దుర్యో—కుమారా! అట్లనెద వేమి! మాకందరికిని గనిపించుచుండఁగా నీకుఁ గనిపింపకున్నదా! చాలు, చాలు, చూడుము.

లక్ష్మ—(చూచి) అయ్యయ్యో! ఏమిది! కన్నులు తెఱచి చూచినంతనే నాదేహము కంపమెత్తుచున్నది. సర్పంబును గూర్చుండఁబెట్టి పెండ్లికూతురనుచుంటి రేమి? పడగవిప్పికొని నన్నుగఱవనుంకించుచున్నది. నేనిక్కడయుండఁ జాలను. (వణఁకుచున్నాఁడు.)

దుర్యో—

తే॥ గీ॥ చారుశారదపూర్ణిమా చంద్రవదన
హలధరునిపుత్త్రి నీకాంత యచటనుండఁ
దగునె సర్పంబటంచును దలఁపనీకు
మతిచలించెనాయేమి! కుమారచంద్ర.

భీష్మ—వత్సా! లక్ష్మణా! చంద్రబింబసమానయగు శశిరేఖంజూచి పామందువేమి?

కర్ణ—నాగుబామును బోలియున్న యామెకీల్జడం జూచియట్లనుకొంటివా యేమి? భయపడకుము.

లక్ష్మ—అయ్యో! ఆమెకీల్జడ కాదు. ఇప్పుడు మఱియొక రూపము దాల్చినది. అదిగో కోతిరూపము దాల్చి పండ్లికిలించుచున్నది. నేనిచ్చటనుండఁజాల. (లేవబోవును)

[సభ్యులందరును చప్పట్లుకొట్టుచు నవ్వుచున్నారు.]

దుర్యో—లక్ష్మణా! ఎన్నఁడును నిట్లుపలికి యెఱుంగవే! మతిపోయినదా లేక భూతమేమైనసోకినదా! భయపడకఁజూడుము.

లక్ష్మ—అయ్యో! నాకు మతిపోలేదు. దయ్యముపట్టలేదు. నిజముగా నట్లున్నది. కన్నులు తెఱచినచో నాకు భయమగుచున్నది.

కర్ణ—లక్ష్మణా! దుర్యోధనాత్మజుండవై సాటిబంధుగులలో నగుపాట్లు దెచ్చుచుంటివికదా!



భీష్మ—వత్సా! భయపడకజూడుము. మాకందరికిని నీకుగానుపించుచున్న రూపంబుగాన్పించదేమి! కన్నులు తెఱువుము.

లక్ష్మ—(కన్నులు తెఱచి) అదిగో మర్కటరూపంబు విడిచి భల్లూకాకారము ధరించినన్ను మ్రింగ వచ్చుచున్నది. భల్లూకంబును దెచ్చి నాకుఁ గట్టబెట్టుచుండి రేమి? అక్కటా నాకుఁ బెండ్లియక్కర లేదు. పెండ్లికూతురునుఁ జూచి ఓభల్లూకమా! నేను నీజోలికి రాను. నీకు మ్రొక్కుచున్నాను. నన్ను మ్రింగరాకుము. (పాఱిపోవుచున్నాఁడు.)

విష్ణుశర్మ—(బలరామునిఁ జూచి) బలరామా! కూతురునకు బహుమంచివరునిఁ గూర్చితివయ్యా!

బల—(తనలో) నవ్వువారికి నవ్వుసంపైనది. ఏడ్పువారికి ఏడ్పుసంపైనది.

రేవ—నాథా! ఏమిగ్రహచారమిది!

బల—రమణీ! మనప్రారబ్ధమిట్లున్నది.

దుర్యో—(లక్ష్మణునిదీసికొనివచ్చి పీటపైగూర్చుండఁజేసి) నాయనా! భయపడకుము. ఇంతమందివీరులుండగా నీకేమిభయము?

లక్ష్మ—అయ్యో! నన్నేల బలవంతపెట్టెదరు. అదిగో! భల్లూకావతారము వ్యాఘ్రంబుక్రింద మారినది. అయ్యలారా! నాకు వివాహమక్కర లేదు. ప్రాణములున్నచో బలుసాకయినను దినవచ్చును. నన్నుఁ బోనీయుడు. మీకు నమస్కారములాచరించెదను.

భీష్మ—(ద్రోణునిఁజూచి) ఆచార్యవర్యా! ఏమివింతయిది!

ద్రోణ—ఇదియంతయు బలరామకృష్ణులు బన్నినమాయగానున్నది.

భీష్మ—నాకును నట్లే తోఁచుచున్నది.

దుర్యో—పితామహా! ఏమిది!

భీష్మ—ఏమియోమాకును దెలియకున్నది. ఇందుకుఁగారణంబెఱుంగరాకున్నది.

దుర్యో—అక్కటా! నలుపురిలో నగుబాట్లయ్యెనుకదా! (కుమారునిఁజూచి) లక్ష్మణా! చిత్తంబు పదుపఱచుకొని శశిరేఖంగూడుము.

లక్ష్మ—అయ్యో! నన్నుఁ జంపదలంచితిరా! అదిగోవ్యాఘ్రము నోరు తెఱచుకొని నామీఁదికి వచ్చుచున్నది. అక్కటా! నన్నుఁ జంపిన మీ కేమిలాభము వచ్చును? రక్షింపుఁడు. రక్షింపుఁడు. (పీటమీఁదనుండి లేచిపోవుచున్నాఁడు.)

శశి—(లక్ష్మణునివెంటనంటి) హా! మనోహరా! సుయోధనాత్మజా! ఎచ్చటికి బోయెదవు? పతిమార్గంబునే సతిగూడ యవలంబించ నలయునుకదా! నీరూపరేఖలావణ్యాతిశయంబులంగూర్చి యెందరో చెప్పగావిని యుంటినేగాని కన్నులారనిదివఱకెన్నఁడును వీక్షించి యుండలేదు. ఇప్పుడుతిలకించితిని. ఆహా! నీయట్టిభర్త దొరికినందుల కెంతయో సంతసింపుచుంటి. నన్నుఁజూచి భీతిఁజెంది పరుగిడెదవేల? రమ్ము. రమ్ము. నన్ను జేపట్టుము. (అనిలక్ష్మణుని నొకదెబ్బగొట్టి ఘటోత్కచ కారమును ధరించును.)

ఘటో—ఓరోరీ! దుర్యోధనా! దుశ్శాసనా! కర్ణా! ఎందుబోయెదరు. వివాహకార్యార్థమై యరుదెంచిరిగా! నిలునిలుఁడు.

దుర్యో—భీష్మద్రోణులారా! ఇంతవఱకును మాయరక్కసుండని యెఱుంగక పోయితిమికదా!

బల—అయ్యో! మాశశిరేఖయేది!

రేవ—శశిరేఖా! శశిరేఖా! (బల, రేవ నిష్క్రమించుచున్నారు.)



ఘటో—

శా. ఓరీకౌరవపాంసనా నిలువుమీ! ఓరోరిదుశ్శాసనా!
పారంబోకుము; ధైర్యమూనుమిక నీ భావంబునం గర్ణుఁడా!
చేరన్ వచ్చెను భీమనందనుఁడిదే చెండాడఁగా మిమ్ములన్
నారీరత్నమునిచ్చి లక్ష్మణునకున్ గావింతు రేపెండిలిన్.

దుర్యో—కర్ణా! వీఁడెవఁడో మాయరక్కసునివలె నున్నాఁడు. ఇప్పుడు కర్తవ్యమేమి?

కర్ణ—వీనిమదము దూలించుటయే.

ఘటో—ఓరీ! దురాత్ములారా! మదముదూలించుటయా కర్తవ్యము.

ఉ. మునుమాతండ్రిలు చేసినట్టి సమయంబున్ జప్తియందుంటచే
ఘనసంగ్రామతలంబునందు మిములన్ గావింపఁగాకుండిరన్
ఘనవైవాహము సేయగామనములోఁ గాంక్షించి యేతెంచు మి
మ్మునుదున్మాడకయుందునే రణములోఁ బూర్ణప్రతాపంబునన్.

ఉ. ఇఁకనైనన్ మదిబుద్ధితెచ్చుకొని నీ వేమాత్రముం నిల్వకన్॥
బ్రకటప్రాభవమెల్ల వీడిచనుమీ పట్టంబునుం బాంధవ
ప్రకరంబుల్ గొలువంగఁగానియెడ నస్మత్క్రూరనారాచ జా
లకగోరాహతిఁద్రెళ్ళనేతునినునా లంబందు దుర్యోధనా.

(దుర్యోధనాదులను దఱుముచు నిష్క్రమించుచున్నాఁడు.)

[శ్రీకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కృష్ణ—(తనలో) అన్నా! ఎంతచిత్రము జరిగినది. అగ్రజుండు శశిరేఖను నభిమన్యుకీయకపోవుటచేతనేకదా యిట్లైనది. సుయోధనాదులకు జక్కని పరాభవము జరిగినది. (ప్రక్కంజూచి) అదుగో! అగ్రజుండగు బలరాముఁడిట్లు వచ్చుచున్నాఁడు.

[బలరాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

బల—(కృష్ణునిఁజూచి) తమ్ముఁడా! గోపాలకృష్ణా! ఇదియంతయు
మాయగనున్నది. శశిరేఖ యెచ్చటను గానుపించుటలేదు.
అభిమన్యునకుఁ బిల్లనీయక లక్ష్మణునికీయనెంచినందుల కిట్టి
లంబనుభవించితి. సుయోధనాదులు నిజపురంబునకు బోయి.
ఇప్పుడేమి సేయుదము? నీకుగోచరముగాని విషయంబీచతుర్ద
భువనంబులయందేమియులేదు.

కృష్ణ—అగ్రజా! ఇందేమియు వింతలేదు. ఇట్టిమాయచేసిన మహా
వీరుండు, భీమసేననందనుండగు ఘటోత్కచుండు. ఇంతకుము
న్నె యాతండు మాయాబలంబుచే శశిరేఖనుగొనిపోయి తన
యాశ్రమంబుననున్న యభిమన్యు సుభద్రలయొద్దనుంచి యా
తడే శశిరేఖాకృతిందాల్చి యిట్టిచిత్రములు చేసెను.

[తెరలో]

శా. నాతమ్ముండభిమన్యుఁడీడి యిటులన్ నారీశిరోరత్నమున్
జేతోమోదముతోడ లక్ష్మణునకున్ శీఘ్రంబుగాఁబెండ్లి వి
ఖ్యాతిన్ జేయదలంచినాఁడవె యసత్యాచారివై; కౌరవ
వ్రాతంబేమొనరించెనో తెలిసెనే భాగ్యంబు జేకూడెనే.

బల—కృష్ణా! ఘటోత్కచ మహాకోపదవానలంబు జల్లార్పుటెట్లు
కృష్ణ—ఆతనిని శాంతిపఱచుటకు ముక్కంటియైనను శక్తుండుగాఁడు

[తెరలో]

ఓహో! బలరామా! బాల్యంబునుండియు మాయింట బెఱిగిన నే
నల్లుండగు నభిమన్యునకు గన్యకనిత్తునని వాగ్దానంబు జేసి యిప్పుడ
త్యవాదివై సుయోధనాత్మజునకిచ్చి వివాహము సేయనెంచితివా!
వివాహమహోత్సవము బాగుగా జరిగినదే. నీసోదరియగుసుభద్ర
[illegible] పెట్టితివి. బాంధవ్యమును విచారించి యూరకుంటిని. ఇప్పు



ను నీయిష్టముండెనేని సత్వరమ్ముగ నాయాశ్రమంబునకువచ్చి శశిరే
ఖాభిమన్యులకు వివాహముచేయుము.

బల—(కృష్ణునిజూచి) కృష్ణా! ఏమికర్తవ్యము?

కృష్ణ—అగ్రజా! ఘటోత్కచుని యిష్టప్రకారము సేయుటయే కర్త
వ్యము.

బల—(ఆకసమువంకఁజూచి) వత్సా! ఘటోత్కచా! మేనల్లునివిడిచి
కన్యనునొరులకీయనెంచినందుకు ఫలంబనుభవించితిని. ఇక నీ
యిష్టప్రకార మాచరించెదను. కోపదృష్టిమాని ప్రసన్నుఁడవు
కమ్ము.

[ఆకసమున]

నీవు మహాయసత్యవాదివి నీమాటనమ్మరాదు.

కృష్ణ—(ఆకసమువంకఁజూచి) హిడింబాత్మజా!

కవిరాజవిరాజితము.

వినుమిదెనాఁడగు నల్లునిఁదప్పక వేడ్కతొనీదగు మాటపయిన్
వనితనునీదగు తమ్మునకిచ్చి వివాహము సేయుదు నగ్రజుఁడున్
మనమునకోపముమానుము శాంతముమానుగఁబూనిముదంబు మెయిన్
ననుగనరమ్మిక నగ్రజుమాటల నమ్ముము నమ్ముము భీమసుతా.

ఘటోత్కచుఁడు—(ప్రవేశించి చేతులుమోడ్చి)

[కృష్ణునిచూచి ఘటోత్కచుఁడు పాడెడిపాట.]

మోహనరాగం—ఆదితాళం.

ప॥ వందనమిదెగోనునందననందనా। వందిమాగధ వినుతామును
దా॥ వంద॥

అ॥ ప॥ సుందరవిగ్రహా। శంఖచక్రధర। చూడగంటివినుతయానంద
మొదవ॥ వంద॥

యెందరెందరో యీవసుంధరన్ । వింతగనినుగొని యాడగవింటిని
నందన॥
మోదమునందానానంద మొందగను । దేవాప్రీత్యాత్మనైతి విష్ణు
నందన॥

మాలిని.

దనుజకులవిదారీ ! ధైర్యధౌరేయమూర్తీ
దినమణిసమతేజా ! దేవతాలోకవంద్యా
ఘనయదుకులదీపా ! కంజనేత్రా శుభాంగా
మునిసుతపదపద్మా ! భూరిసంతోషభావా.

(అని కృష్ణునకునమస్కరింపుచున్నాడు.)

కృష్ణు—వత్సా! ఘటోత్కచా! నీసాహసకార్యంబునకుసంతసించితి॥
ఘటో—దేవా! దేవరయగ్రజుండగు నీబలరాముం డభిమన్యునివీడి, నకుమారి నొరులకీయదలంచినందున నింతకార్యంబుసలిపితి॥ నాచేసినతప్పులెల్ల మన్నింప వేడుచున్నాను.
బల—ఘటోత్కచా! అందుకుఫలంబనుభవించితిని. శశిరేఖ సుఖి గనున్నదికదా.
ఘటో—అయ్యా! నాయాశ్రమంబున సుభద్రాభిమన్యులచే రక్షి పబడుచున్నది. ఇంక మనమందరమును నచ్చటికేగి శశిరే భిమన్యుల వివాహంబునెఱప వేడుచున్నాడ.
బల—వత్సా! నీయభీష్టమెట్లో యట్లేకానిమ్ము.
కృష్ణు—ఘటోత్కచా! ముందునీవేగి వివాహప్రయత్నము సే ము. మేమును సత్వరముగ వచ్చెదము.
ఘటో—చిత్తము. (అందరునిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# శశిరేఖాపరిణయము.

## పంచమాంకము.

### ఘటోత్కచాశ్రమము.

[ప్రవేశము:—హిడింబ, సుభద్ర, శశిరేఖ, అభిమన్యుడు.]

ద్వారకకేగిన ఘటోత్కచుడు రానందున సుభద్రపాడెడిపాట.

హిం॥ తోడిరాగం—ఏకతాళం.

ప॥ యేలనోమనఘటోత్కచుండు । యింకనూరాడాయె నేమయ్యెను
మోల॥
అ॥ ప॥ జాలముసేయక । సత్వరంబుగ । చనుదెంచెదనని జనెనిర్భ
యమున॥ యేలనో॥
వేలకొలది । యోధులుగల్గిన । కౌరవాధముని । చేజిక్కెనొమరి
బాలామణిశశిరేఖకొరకు యే । బాధలొందుచున్నాడో । దలపగ॥
యేలనో॥

సుభ—అక్కా! ఘటోత్కచుండు ద్వారకానగరంబునకరిగి కడుదడవైనది. ఇంతవరకును రాలేదు. నాకేమియు దోచకున్నది.
హిడిం—చెల్లెలా! డెందంబున సందియంబొంద నవసరములేదు. ఆతడిప్పుడేరాగలడు. అతనికేమియు భయముండదు.

సుభ—ఆకౌరవులచే నేమిచిక్కులుపడుచుండెనోయని భయముకలుగుచున్నది. అంతమంది మహాయోధులలో నీతండొక్కఁడేమి సేయగలఁడు?

హిడిం—వెఱ్ఱిదానా! ఘటోత్కచునిబలంబును నీవెఱుఁగవు. మహామాయాబలసంపన్నుఁడు. సంగ్రామరంగంబున నాతనిని నేఁటిపాటి జూచుటకు త్రిశూలపాణికైనను తరంబుగాదు.

అభి—సోదరునకట్టిచిక్కులు తటస్థింపఁజేయుటకు నేనేకదా కారణము. నేనునుగూడ నేతెంచెదననిపలుకవలదని వారించుటచే నూరకొంటిని. అందులకిప్పుడు సంశయింపనేల. నేనీక్షణంబునందే ధనుర్ధరుండనై ద్వారకాపురంబునకరిగి, యాదవకౌరవబలంబులను గాందీసీకులం జేసి, సోదరునిదోడికొనివచ్చెద.

హిడిం—వత్సా! అభిమన్యూ! నీవంత పరాక్రమవంతుఁడవే యగుదువు కాని యంతవరకవసరము లేదు. నీయన్న యిప్పుడే రాగలఁడు.

[అంతఘటోత్కచుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఘటో—(తనలో) ఆహా! పాండవులనుదూషించి తనకన్నియను నభిమన్యునకిచ్చుట సమ్మతింపక, దుర్యోధనాత్మజునికిచ్చి పెండ్లి సేయఁదలంచిన బలరాముండును, నింటమేనల్లుఁడున్నాఁడని యెఱుంగక, శశిరేఖనుతనకుమారునకుఁ జేసికొనఁదలంచి వివాహమునకై తరలివచ్చిన దుర్యోధనుఁడును సంపూర్తిగనాచేఁ బరాభవమందిరికదా. నేనాచరించిన చిత్రములన్నియు నభిమన్యుఁడు జూచియుండినచో నెంతైనసంతసించియుండును. అదుగో శశిరేఖాయుతంబుగ నాతల్లులు నారాకకై యెదురుఁజూచుచున్నట్లున్నారు. (సుభద్రాహిడింబలఁ జేరి) తల్లులారా! నమస్కారములు.



సుభ—వత్సా! ఘటోత్కచా! మరలనాకంటఁబడితివా! నీవరిగినదాదిగ మరలనెప్పుడువత్తువో లేక, నాదుష్టకౌరవులచే నేమియపాయంబు వాటిల్లునోయని భయంబందుచుంటి. నిన్నుఁ జూడగనే నాకు మహానందంబు జనించినది. కుమారా! ఆకౌరవులనుండి యెట్లు తప్పించుకొని వచ్చితివి! ఏమేమిచిత్రములు గావించితివి!

ఘటో—అమ్మా! నేను గావించినమాయలు చెప్పుటకు నాకు పదములు చాలవు. చూచితీరవలయును. అమ్మా! ఏమి చెప్పుదును. మీయనుజ్ఞవడసి యిచ్చటనుండియరిగి, ద్వారకాపురంబునుజొచ్చి మాయాబలంబున నేనే శశిరేఖాకృతిందాల్చి, శశిరేఖాసౌధంబున నభిమన్యునకై విచారింపుచు నుండియుంటిని.

సుభ—వత్సా! ఎంతమాయచేసితివి! తరువాత,

ఘటో—తరువాత, శశిరేఖచెలికత్తెలువచ్చి నన్ను నిజమైనశశిరేఖయేయనితలంచి యెంతయో యాయూగడించి యెట్టకేలకు పెండ్లిపీటలమీద గూర్చుండ దీసికొనిపోయిరి.

సుభ—ఆహా! ఏమిచిత్రము. తరువాత,

ఘటో—తరువాత నేనాపెండ్లికుమారుఁడగు లక్ష్మణునకనేకవికృతరూపంబులుగాఁ గనఁబడి యాతనికతిభయముపుట్టించి పెండ్లిపీటపైనుండి పాఱిపోవునట్లు గావించితిని. అంతట నేను నిజరూపంబునుధరించి కౌరవవ్రాతంబును నిజపురమార్గంబును బట్టునట్లు గాందీసీకులంజేసితి. తరువాత బలరాముండిదియంతయు కృష్ణునకెఱింగింప నమ్మహానుభావుండిదియంతయు ఘటోత్కచుని మాయయనిచెప్పి యతనిని బ్రతిమాలుకొనుమనెను. ఆ బలరాముండట్లుగావింప, నేను నేలకు దిగివచ్చితిని. ఇదివృ

వాహచిత్రము. బలరాముండు శశిరేఖను నభిమన్యునకిచ్చుట కే సమ్మతించెను. వివాహమిక్కడనే జరుగును. బలరామకృష్ణు లిచ్చటికిప్పుడు వత్తురు. (హిడింబంజూచి) వివాహప్రయత్నము లన్నియు గావింపఁబడెనుకదా.

హిడిం—ఇంతకుమున్నే గావింపఁబడినవి.

అభి—తే. గీ. అగ్రజా నాకునై శ్రమ నందియుంది
కౌరవవ్రాతమును నెల్ల బారదోలి
కోమలాంగి నాకునుఁ గూర్చినావు
నీ ఋణం బెట్లుదీరును నిక్కముగను.

ఘటో—తమ్ముఁడా! నీవట్లన జెల్లదు. మన మొరులము కాముకదా. అరుగో బలరామకృష్ణులు, బంధుసమేతంబుగ వివాహంబునకై వచ్చుచున్నారు.

[బలరామకృష్ణులు రేవతి మొదలగువారు ప్రవేశించుచున్నారు.]

అభి—(బలరామకృష్ణులకు నమస్కరించుచున్నాఁడు.)

కృష్ణు—చిరంజీవ. చిరంజీవ.

సుభద్రనుజూచి బలరాముడు పాడెడిపాట.

కన్నడరాగం—ఆదితాళం.

ప॥ చెల్లకుండెమోము । నినుజూడఁ ॥ చెల్ల॥

అ॥ ప॥ చెల్లెలానిన్ను దూషింతినని । చిత్తమునం దిసుమంతయునుంచకుక
యెల్లవిధంబుల । నెంచగతగుమే । నల్లునివిడచి అన్యుల్లకు నా
పిల్లనొసగినే । నల్లరిపాలై । పేరాశనునిను జేరితిసమ్మా ॥ చెల్లకుండె॥

బల—(సుభద్రంజూచి) చెల్లెలా! మేనల్లునివిడిచి యన్యులకుఁ బిల్లనీయఁదలంచి, నిన్నెన్నియో దుర్భాషలాడినందుకు నన్ను సైరింపుము.



సుభ—అగ్రజా! విధివశంబుననట్టిది సంభవించెను. గతించినదాని నిప్పుడుదలంపనేల!

కృష్ణు—(శశిరేఖనువిలోకించి) అమ్మాయీ! శశిరేఖా!

తే. గీ. మొదటినుండియు మలలోన భూరిగుణుని
అర్జునాత్మజుఁగోరియు నున్నందుకిప్పు
డతనికే కాంతవౌచును నలరినావు
నీదుకోరిక నెఱవేఱె నిశ్చయముగ.

(అభిమన్యునివిలోకించి) అభిమన్యా! నీకోరిక నెఱవేరినది.

(ఇంచుకయూరకుండి) అదిగో! శశిరేఖాభిమన్యుల వివాహంబునకు దేవేంద్రుండుగూడ నరుదెంచుచున్నాఁడు. ఇప్పుడుగదా మన భాగ్యము ఫలించినది.

[దేవేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు. అందరును నెదురేగి తోడ్కొని వచ్చుచున్నారు.]

కృష్ణు—విబుధలోకేశ్వరా! నీపౌత్రుండగు నీతనివివాహంబునకు నీవు స్వయముగ విచ్చేయుటంజేసి మేము కృతార్థులమైతిమి. నీరాక వివాహంబునకు మరింత శోభకారణంబైనది.

ఇంద్రు—సాక్షాద్విష్ణుస్వరూపుండవగు నీవు నన్నట్లు శ్లాఘింపవలదు.

బల—దేవేంద్రా! ఘటోత్కచుని కారణంబున మిమ్ము దర్శింపగంటిమి. ధన్యులమైతిమి.

ఇంద్రు—వివాహకాలమైనది. ఇంక నాలోచింపనేల?

బల—(శశిరేఖంజూచి) అమ్మాయీ! బాల్యంబాదిగ నీవుకోరినవరుఁడే లభించెను.

తే. గీ. పతియె దైవంబుభావిని మదిదలంచి
యాతఁడు చెప్పిన చొప్పున నలరుచుండి
పుత్రపౌత్రాదులను గాంచి పొగడునట్లు
యుభయకులములకునుగీర్తి యొసఁగవమ్మ.

(శశిరేఖచేయి యభిమన్యుని చేతిలో యుంచును వధూవరులు పుష్పమాలిక లొండొరులు వైచికొందురు.)

బల—(వధూవరులచే నింద్రికును గృష్ణునకును నమస్కరింపఁజేయుచున్నాడు.)

కృష్ణు—అభిమన్యా! మీయిరువురకోరికలును ఫలించినవి. ఇంక నేమి కావలయును?

అభి—ఇంకగావలసిన దేమున్నది. అయిననిట్లగుగాక.

ఉ. మానిని మానసం బెవరి పైననుజిక్కెనొ దానిజూచి, స
న్మాన మెలర్పగాదగిన భర్తనుదెచ్చి వివాహకార్యముల్
మానక దల్లిదండ్రులు సమంజసబుద్ధి నొనర్తురేగాక, స
న్మానులుగొల్చు నీదుపద పద్మములన్ భజియింతు రెల్లరున్.

[సమాజకులందరు కలసిపాడెడి హారతిపాట.]

కేదారరాగం—ఏకతాళం.

ప॥ హారతిగైకొనుమా । జయ । హారతిగైకొనుమా॥

అ॥ ప॥ ఓరజతగిరీంద్రుని ప్రియభామా । యోగీశ్వర హృత్సరోమ రాళీ॥ హారతి॥

ఓరమణీయవిలాసిని త్రైలోక । జననీ । గమనీ । కృపాదృష్టిని ॥హారతి॥

భారతప్రజలైకమత్యవ్రతులై । స్వారాజ్య । యుతులై వరలగ । బ్రో వగ॥ హారతి॥

{సంగీతశశిరేఖాపరిణయమునందలి పాటలు సంపూర్ణము.}

ఇంద్రి—తథాస్తు.

(అందరును నిష్క్రమించుచున్నారు.)

ఇది పంచమాంకము.



(శశిరేఖచేయి యభిమన్యునిచేతిలోయుంచును వధూవరులు పుష్పమాలికలొండొరులు వైచికొందురు.)

బల—(వధూవరులచే నింద్రునకును గృష్ణునకును నమస్కరింపఁజేయుచున్నాడు.)

కృష్ణ—అభిమన్యూ! మీయిరువురికోరికలును ఫలించినవి. ఇంకనేమి కావలయును ?

అభి—ఇంకగావలసినదేమున్నది. అయినవిట్లగుగాక.

ఉ. మానిని మానసంబెనరి । పైననుజిక్కెను దానిజూచి, స
న్మాన మెలర్పగాదగిన । భర్తనుదెచ్చి వివాహకార్యముఁ
మానక దల్లిదండ్రిలు స । మంజసబుద్ధి నొనర్త్రిగాక, స
న్మానములుగొల్చు నీమపద । పద్మములఁ భుజియింతు రెల్లరుఁ.

[సమాజకులందరు కలసిపాడెడి. హారతిపాట.]

కేదారరాగం—ఏకతాళం.

ప॥ హారతిగైకొనుమా । జయ । హారతిగైకొనుమా॥

అ॥ ప॥ ఓరజితగిరీంద్రుని ప్రియభామా । యోగీశ్వర హృద్వనోమరాళీ॥ హారతి॥

ఓరమణీయవిలాసిని త్రైలోక । జననీ । గనునీ । కృపాదృష్టిని ॥హారతి॥

భారతప్రజలైకమత్యవ్రితులై । స్వరాజ్య । యుతులై వరలగ । బ్రోవగ॥ హారతి॥

{ సంగీతశశిరేఖాపరిణయమునందలి
పాటలు సంపూర్ణము. }

ఇంద్రు—తథాస్తు.

(అందరును నిష్క్రమించుచున్నారు.)

ఇది పంచమాంకము.



(శశిరేఖనేయి యభిమన్యునిచేతిలోయుంచును వధూవరులు పుష్పమ [illegible]క లొండొరులు వైచికొందురు.)

బల—(వధూవరులచే నింద్రునకును గృష్ణునకును నమస్కరింప యుచున్నాడు.)

కృష్ణ—అభిమన్యా! మీయిరువురకోరికలును ఫలించినవి. ఇంక నేమి కావలయును?

అభి—ఇంకగావలసినదేమున్నది. అయిననిట్లగుగాక.

ఉ. మానిని మానసంబెవరి । పైననుజిక్కెను దానిజూచి, స
న్మాన మెలర్పగాదగిన । భర్తనుదెచ్చి వివాహకార్యముం
మానక దల్లిదండ్రులు స । మంజసబుద్ధి నొనర్తురిగాక, స
న్మానములుగొల్చు నీసుపద । పద్మములం భుజియింతు రెల్లరున్.

[సమాజకులందరు కలసిపాడెడి. హారతిపాట.]

కేదారరాగం—ఏకతాళం.

ప॥ హారతిగైకొనుమా । జయ । హారతిగైకొనుమా॥

అ॥ ప॥ ఓరజితగిరీంద్రుని ప్రియభామా । యోగీశ్వర హృద్సరోమ
రాళీ॥ హారతి॥

ఓరమణీయవిలాసిని త్రైలోక । జననీ । గనుసీ । కృపాదృష్టిని ॥హారతి॥

భారతప్రజలైకమత్యవ్రతులై । స్వరాజ్య । యుతులై వరలగ । బ్రో
వగ॥ హారతి॥

{ సంగీతశశిరేఖాపరిణయమునందలి
పాటలు సంపూర్ణము. }

ఇంద్రు—తథాస్తు.

(అందరును నిష్క్రమించుచున్నారు.)

ఇది పంచమాంకము.



